# కిన్నెరసాని పాటలు

కల్పన :

కిన్నెర మహాపతివ్రత, అందరు తెలుగుకన్నెలకు మల్లేనే ఉద్విగ్న హృదయ. ఎక్కువ తెలుగుకుటుంబాలకు సామాన్యమైన అత్తాకోడళ్ళ పోరాటం ఆ యింట్లోనూ వెలిసింది. కొడుకు సుఖమెరుగని అత్తకు కిన్నెరమీద నింద లారోపించటం పని అయింది. ఒకప్పుడు ఆవిడ చేసిన నింద భరించటం కష్టమైంది. కిన్నెరహృదయం శోకంచేత ప్రళయ సముద్రం అయింది. కిన్నెరభర్త ఏంచేస్తాడు ? తల్లిని కాదనాలేడు, భార్యను ఓదార్చుకోనూలేడు. ఆవేశహృదయంతో కిన్నెర అడవులవెంట పరుగెత్తింది. భర్తపోయి ఆమెను వద్దని కౌగిలించుకున్నాడు ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై వాగై ప్రవహించింది. అతడు శోకించి శోకించి శిల అయినాడు.

వనములను దాటి 'వెన్నెల బయలు' దాటి
తోగులను దాటి దుర్గమాద్రులను దాటి
పులుల యడుగుల నడుగులు కలుపుకొనుచు
'రాళ్ళ వాగు' దాటి పథాంతరములు దాటి

అచట కిన్నెరసాని—
నా యాత్మయందు
నిప్పటికి దాని సంగీతమే నదించు....

# కిన్నెరపుట్టుక

ఓహో కిన్నెరసానీ
ఓహో కిన్నెరసానీ
ఊహామాత్రములోపల
నేలనిలువవే జవరాలా !

కరగిపోతి నిలువెల్లను
తరలించితి నాజీవము
మరగిపోయి నాగుండియ
సురిగిపోయెనే ప్రియురాలా — ఓహో! కిన్నెరసానీ

తనయెడ తప్పే యున్నది
అనుకోవే నాథుని దెస
వనితలు నీవలె కఠినలు
కనిపించరువే యెందును — ఓహో !

ఇంతకోప మేమిటికే
ఇంత పంత మేమిటికే
ఇంతులు జగమున పతులకు
నింతలు సేయుదురటవే — ఓహో !

ఇప్పుడెగదె నాకౌగిట
కప్పితి నీశోకమూ ర్తి
అప్పుడె నిలువున నీరై
యెప్పుడు ప్రవహించితివే — ఓహో !

అంత పగే పూనితివో
అంతకోప మొందితివో
ఇంతీ ! నను శిక్షింపగ
నింకొక మార్గము లేదటె — ఓహో !

రాలపైన తొలినాళుల
కాలిడగా నోర్వలేవు
రాలను కొండల గుట్టల
నేలా ప్రవహించెదవో — ఓహో !

కిన్నెర

పుట్టుక

నీవు మహాపతిశీలవు
కా వని నేనంటినచే
అటు లంటిన నాకంఠము
కటారి త్రెంచకపోతిన - ఓహో !

వెన్నెలవలె తెల్లని నీ
సన్నని మేనిపసందులు
కన్నులకును కనిపించెను
చిన్నితరగవాలువోలె - ఓహో !

నీ యొయ్యారపు నడకలు
మాయురె కనిపించెను పో
మలకలుగా ప్రవహించిన
సెలయేట భవన్మూర్తిని - ఓహో !

నీ నవ్వులు నురుగులుగా
నీ వళు లవి తరగలుగా
నీ కన్నులు మీనులుగా
నీ కరణిని ప్రవహించెదు - ఓహో !

నీ జఘనము నిసుకతిన్నె
గా జూచిన నాకన్నులు
ఊటీపడవు నేలపైన
మరిసిపోవు లోనెలోనె - ఓహో !

మున్ను భగీరథ భూపతి
వెన్నువెంట పరుగెత్తిన
ఆ న్నాకధునీవైఖరి
నున్నద్ది నీ చన్నుత్రోవ — ఓహో !

పరుగెత్తెదు నీ వేణీ
బంధము పూనితిచేతను
కరమున వేణికి బదులుగ
కాల్వగట్టె నీటిపొరలు — ఓహో !

ఎడమచేత నీకొంగును
ఒడిచిపట్టుకొంటి చెలీ
తడిచేతను కొంగులేక
తడబడితిని ప్రియురాలా! — ఓహో !

నీ పాదమ్ములు మోచిన
నా ఫాలమ్మున చెమ్మట
ఈ పగిదిని వాగువైన
నీపై ప్రేమము చూపెడి — ఓహో !

నీవే నా జీవితమణి
నీవే నా జీవేశ్వరి
నీవే నా చూడామణి
నీవేనే ప్రియురాలా — ఓహో !

## కిన్నెర పుట్టుక

నీవే యిట్లైతివిపో
జీపము లుండునె నామై
నీవలె నేను ప్రవాహం
బై వచ్చెద రానీవే – ఓహో!

ఈవు రసాకృతి వగుటను
ఈవైఖరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను
పూనుదునె ధునీవైఖరి – ఓహో!

మునుపే నీ కన్నులు గని
అనుకొంటిని నీవు నదీ
వనితవు మానుషజన్మము
కనినావని మనసులోన – ఓహో!

ఈ తరగల కదలికలో
ఓ తరుణీ! నీకంత
శ్రీతారుణ్యము తోచగ
పోటివచే పరుగులెత్తి – ఓహో!

నిను కౌగిట నదిమిన నా
తనువు పులక లణగలేదు
కనువిప్పితినో లేదో
నిను కానగ లేనైతిని – ఓహో!

ఈ దురదృష్టుడ నేమని
రోదించెద నడవులందు
నీదే నీదే తప్పని
వాదించిన వడవు లెల్ల - ఓహో !

ఇదిగో చేతులను చాచితి
నేడ్చుచుంటి కంఠమెత్తి
ముదితా! వినిపించుకొనక
పోతివషే ప్రియురాలా - ఓహో !

నీకై యేడిచి యేడిచి
నా కంఠము సన్నవడియె
నా కన్నులు మందగించె
నా కాయము కొయ్యబారె - ఓహో !

ఈయేడుపు రొదలోపల
నా యెడలే నే నెఱుగను
నా యీ దేహ మిదేమో
జాయివోలె నగుచున్నది - ఓహో !

# కిన్నెర నడకలు

కరిగింది కరిగింది
కరిగింది కరిగింది
కరిగి కిన్నెరసాని వరదలై పారింది
తరుణి కిన్నెరసాని తరకల్లు కట్టింది
పడతి కిన్నెరసాని పరుగుల్లుపెట్టింది

కదిలింది కదిలింది
కదిలింది కదిలింది
కదలికిన్నెరసాని వాముగుల్లుపోయింది
సుదతి కిన్నెరసాని సుళ్లుగా తిరిగింది
ముదిత కిన్నెరసాని నురుసుల్లు గ్రక్కింది

నడిచింది కడరాళ్ల
గడిచింది పచ్చికల్
తడిసి కిన్నెరసాని సుడులలో మొరసింది
జడిసి కిన్నెరసాని కడలందు వొరిసింది
సుడిసి కిన్నెరసాని జడలుగా కట్టింది

కరగగా కరగగా
కాంత కిన్నెరసాని
తరగచాలులమధ్య తళతళా మెఱసింది
నురుసుపిండులతోడ బిరబిరా నడిచింది
ఇసుక నేలలపైన బుసబుసా పొంగింది

కదలగా కదలగా
కాంత కిన్నెరసాని
పదువుకట్టిన లేళ్ళకదుపులా తోచింది
కదలు తెల్లని పూలనదివోలె కదిలింది
వదలు తెల్లనిత్రాచు పడగలా విరిసింది

నడవగా నడవగా
నాతి కిన్నెరసాని
తొడిమ యూడినపూవుపడతిలా తోచింది
కడు సిగ్గుపడు రాచకన్నెలా తోచింది
బెడగుపోయిన రత్నపేటిలా తోచింది

పతి రాయివలె మారి
పడియున్న చోటునే
పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది
ముగుద కిన్నెరసాని వగచెంది తిరిగింది
వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది

తాను నదిగా నేల
నైనా నను చు లోన
పూని కిన్నెరసాని పొగిలింది పొగిలింది
ముక్తగీతిఃవోలె మ్రోగింది మ్రోగింది
ఒకచోట నిలువలే కురికింది వురికింది

ఏ వుపాయముచేత
నైన మళ్ళీ తాను
మనిసి కిన్నెరసాని నగుదామ యనిపించి
ఆపలేనంత కోరికచేత విలపించి
ముగుద కిన్నెరసాని మొరసింది మొరసింది

తను వీడితే వోర్చు
కొనలేడు కాబోలు
బ్రతికుండగా యింతప్రణయమ్ము కలదంచు
తెలిసితే యింకెంత చెలిమి వుండే దంచు
తలపోసి తలపోసి సొలసె కిన్నెరసాని

అటువంటి పతితోడి
అటువంటి కాపురం
విటుచేసికొంటినం చెక్కడాలేనంత
వగచెంది వగచెంది వనిత కిన్నెరసాని
వనరింది వనరింది వనిత కిన్నెరసాని

తుద కేమి చేయగా
నెదవోక అలవోక
పతిరాయిగా మారి పడియున్న గుట్టపై
అతివ తన కెరటాలహస్తాలతో చుట్టి
వెతపొంది వెతపొంది విట్టు ఘోషించింది

మాటి మాటికి కొండ
మాద్రిగా పడివున్న
తన నీటుకాణ్ని చేతుల కౌగిలిస్తుంది
పలకవా యని మ్రోతపడి పల్కరిస్తుంది
పతిగుట్టపై తాను వ్రాలియేడుస్తుంది

"ఓ నాథ ! ఓ నాథ !
ఓ నాథ ! ఓ నాథ !
నాకుమల్లే నీవు నదివోలె పారరా
జలముగా యిద్దరము కలిసిపోదాముర
కెరటాలు కెరటాలు కౌగిలిద్దాముర

ఓ నాథ ! ఓ నాథ !
ఓ నాథ ! ఓ నాథ !
నీయందు తప్పింక నేను చెయ్యను లేర
ఆనపెట్టితివేని అడుగుదాటను లేర
ఇక జన్మలో కోప మింత పొందను లేర

రార ! ఓహో నాథ
రార ! ఓహో నాథ
వెలది నీకిన్నెరా కలగిపోయిందిరా
నాతి నీకిన్నెరా నలగిపోయిందిరా
పడతి నీ కిన్నెరా బడలిపోయిందిరా

ఓనాథ ! నీయందు
నేను చేసిన తప్పు
తిరిగి యెప్పటికైన తీర్చుకుంటానురా
నీత్రోవ నీదిరా నాత్రోవ నాదిరా
మరల నాతోనీవు మాటాడబోవురా."

పిలిచింది పిలిచింది
పిలిచింది పిలిచింది
పిలిచి కిన్నెరసాని పిలుచుటాపేసింది
బడలి కిన్నెరసాని పడిపోయినట్లైంది
తరుణి కిన్నెరసాని కెరటాలు తగ్గింది

వనరింది వనరింది
వనరి కిన్నెరసాని
మండియారి నిప్పుమాద్రిగా నారింది
తన కర్మమింతియేయని లోన ననుకుంది
తన కింక పతితోడి తగులు లేదనుకుంది

చేతులారా తాను
చేసుకున్నానని
యింతి కిన్నెరసాని యేడ్చినా యేడ్పులూ
సుదతి కిన్నెరసాని చూపినా దుఃఖమూ
ఆవికూడ జలములై ఆమెలో కలిసినై.

"నీలిమబ్బుల బోలు
నిడివి నీచేతుల్లు
నన్నింక కౌగిలించగరావు కాబోలు
కడుప్రేమతో చేరగాతీవు కాబోలు
నెమ్మదిగ నాయొడల్ నిమురవుకాబోలు

నేను కోపము నంది
నీప్రక్క నుండగా
వలదన్నకొద్ది నా పదము లొత్తుచు నీవు
తెలచి కౌగింటిలో తేర్చుకుంటూ నీవు
నాఱొమ్ము తలచేర్చగారావు కాబోలు

తలిరాకు వంటిమె
త్తని యెఱ్ఱ పెదవితో
తార్చి నామోము నద్దగరావు కాబోలు
నాయెడల్ మివుల నందపుకుప్ప యనిచెప్పి
ఎల్లతావులను ముద్దిడరావు కాబోలు"

అని సన్నగొంతుతో
వనరి కిన్నెరసాని
రొద యడంగినపావురాయిగొంతుకవోలె
తనలోన తానేమొ మెలమెల్ల రొదచేసి
కొనుచు పల్లపునేలకును డిగ్గి పడిపోయె

జలదేవతలు వచ్చి
నెలత కిన్నెరసాని
పదమంచు పదమంచు బలవంత పెట్టంగ
మరీమరీ పతిచుట్టు తిరిగి కిన్నెరసాని
వలవలా యేడ్చింది పలపలా కుందింది

జలదేవతలు వచ్చి
చలపెట్టి పతిగుట్టి
విడలేక విడలేక పడతి కిన్నెరసాని

చనలేక చనలేక చాన కిన్నెరసాని
పోలేక పోలేక బాల కిన్నెరసాని

జలదేవతలు వచ్చి
చలపెట్ట పతిగుట్ట
వదలగాలేక యాముడిత కిన్నెరసాని
తల్లిదగ్గరనుండి తనమెడకు పలుపోసి
లాగగా బడ్డట్టి లేగలా సాగింది

సాగింది సాగింది
జాలుగా పారింది
ఆవుపొదుగున పాలు ధారకట్టినయట్లు
వనదేవతలు నీళ్ళు వలకబోసినయట్లు
తల్లి చల్లనిప్రేమ వెల్లివారినయట్లు

జాలుగా పారింది
జలజలా పొంగింది
లేతయెండలు దిశాళిని క్రమ్ముకొన్నట్లు
పాలాట్రగడము పాతర తీసికొన్నట్లు
ముద్దరాలిమనస్సు పొంగి వచ్చినయట్లు

జలజలా పొంగింది
బిలబిలా నడచింది
పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్నెలా
చిన్నగంతులు వేయు తెల్లనాపెయ్యలా
పసిపాప నెలవి వారిన బోసినవ్వులా

నడిచింది నడిచింది
నడిచి కిన్నెరసాని
నడిచి యందాలు చందాలుగా నడిచింది
గడియలోపల పెద్దకాల్వగా కట్టింది
అడవితోగుల రాణి యన్నట్లు తోచింది

ఏమి కిన్నెరసాని
ఏమి కిన్నెరతోగు
బంగారుతీగలో పానకమ్మై పోయె
కొబ్బరిపాలు వాకలుకట్టినట్లయ్యె
వెయ్యావు లొకసారి పిదికినట్లైపోయె

జలదేవతల వెంట
సాగి కిన్నెరసాని
తెలితారకలవెంట వెలుగులా తోచింది
తలిరుపూవులవెంట తావిలా తోచింది
తెనుగుపాటలవెంట తీపిలా తోచింది

వొయ్యారినడలతో
వచ్చుకిన్నెరసాని
వనదేవతలు పూలు పై క్రుమ్మరించారు
భూదేవతలు ఎదురుపోయి దీవించారు
వాయుదేవతలు రమ్మని పాటపాడారు

పాలు కిన్నెరసాని
పజ్జలందున నిల్చి
కోకిలా తన గొంతుకొన విచ్చి పాడింది
పికిలిపిట్టలు మేలి రకముగా కూసినై
తెలుగుపిట్టలు వాళ్ళుతెలియక పాడినై

ఎంతదూరము పోయె
నంతదూరముదాక
తెలవకిన్నెర వెన్క తిరిగి చూచుచెపోయె
పడతి కిన్నెర తిరిగి పతి చూచుచునెపోయె
నాతికిన్నెర తెరిగి నాథు చూచుచె పోయె

పతివంక చూచుచూ
పడతి కిన్నెరసాని
పోయేటివేళలో భూమి తనంతగా
తోరమైవిరియుచూ త్రోవగా చేసింది
కెరటాలతో చొచ్చుకోదు కిన్నెరసాని

బ్రతికి వున్నప్పుడూ
అతివ కిన్నెరసాని
ఎంతఒయ్యారియో, ఎంతనెమ్మదిదానో
అంత ఒయ్యారమ్ము అడుగడుగుపోయింది
అంత యిల్లాలి నెమ్మదితనము చూపింది



# కిన్నెర నృత్యము

కెరటాలలో నుర్వు
తెరచాలులో నీటి
పొరజాలులో కిన్నె
అటు కదలి యిటు కదలి
చిటితరంగాలతో-పొటితరంగాలతో
నటనాలు మొదలెట్టెనే-క్రొన్నిటి
తుటుములా కదలాడెనే

పువుకన్నెలా జగా
రవ నవ్వులా వేల్పు
కవ చివ్వులా కిన్నె
రటు లూగి యిటు లూగి
చిటులు కెరటాలతో - పెటిలు కెరటాలతో
జవ్వజవ్వన నూగెనే - తెలిమల్లె
పువ్వురువ్వులు పోయెనే

చిఱుగాలిలో నూగు
కొఱవంపులో నీటు
తరితీపులో కిన్నె
రటు లేచి యిటు లేచి
జల్లుతుంపురులతో—కొల్లతుంపురులతో
మెల్లమెల్లన నాడెనే-కెరటాల
జల్లులో ముంచెత్తెనే

నడినీటిలో మేలి
జడసందులో నీటి
ముడిపొందులో కిన్నె
రటు పొంగి యిటు పొంగి
రంగారునలలతో-పొంగారునలలతో
చెంగు చెంగున దూకెనే-క్రొంగొత్త
సింగారములు వొలికెనే

సురగాలిలో పొంగు
తరగాలిలో నీటి
తెరడాలులో కిన్నె
రటు పొరలి యిటు పొరలి
పరుగెత్తు నురుగుతో-దరులొత్తు నురుగుతో
గల్లుగల్లున మ్రోగెనే-జల్లుమని
వెల్లువల్ విరజిమ్మెనే

సొనజారుతూ నీటి
పనవాలుతూ అంద
మున సోలుతూ కిన్నె
రటు చెదరి యిటు చెదరి
చిన్నారినడలతో-పొన్నారినడలతో
వన్నెవన్నెలు పోయెనే కిన్నెరా
క్రొన్నెలా తళుకొప్పెనే

చిఱుతేనెలా అచ్చ
రల గొంతులా గజ్జి
యల మ్రోతలా కిన్నె
రటు మొరసి యిటు మొరసి
గలగలారవళితో-జలజలారవళితో
మెల్లగా నూగాడెనే-కెరటాల
జల్లుగా ముసురెత్తెనే

తెగపాడుతూ అంద
ముగనాడుతూ తేనె
వగ లోడుతూ కిన్నె
రటు వాలి యిటు వాలి
తళుకువాకలతోడ-బెళుకువాకలతోడ
మలకలై నటియించెనే-తెలినీటి
పులకలై బుగ్గత్తెనే

లయ పెంచుతూ మధ్య
లయ దించుతూ పాట
రయ మెంచుతూ కిన్నె
రటు సోలి యిటు సోలి
తెలినీటిమేనితో-తలిరాకుమేనితో
ఒయ్యారములు పోయెనే-కిన్నెరా
అయ్యారె యనిపించెనే

ధణధంగిణాం దధోం
గిణ తక్కిణాం మద్దె
లలమ్రోతలై కిన్నె
రటు మ్రోగి యిటు మ్రోగి
చిఱువెల్గు సోనలై సిరులొల్కు-సోనలై
మృదుతాండవము చేసెనే-వనవీథి
పదువుపాయలు కట్టెనే

ఘలు ఘల్లునా వెల్లి
వల పెల్లునా కొల్లి
వలిజల్లునా కిన్నె
రటు త్రొక్కి యిటుత్రొక్కి
గిలుకుటందియలు నా—తళుకుటందియలు నా
అలల నురుసులు తోచెనే-అమధ్య
జలాజలా పొంగెత్తెనే

జిగి బెళ్కులా ధగా
ధగ తళ్కులా జగా
జిగికుల్కులా కిన్నె
రటు నవ్వి యిటు నవ్వి
అలల పెన్నురుసుతో - నెలల పెన్నురుసుతో
తెలుగు వాదుగులు పోయెనే—కిన్నెరా
తెలుగు తీపులు చిమ్మెనే

తెలినుర్వులో చెమ్మ
టలు చిమ్ముతూ అలస
టలు క్రమ్ముతూ కిన్నె
రటు సొక్కి యిటు సొక్కి
చిఱుమీను కనులతో—శ్రమమీను కనులతో
సోగతనములు వోయెనే—లోగొంతు
రాగాలు వెలయించెనే

తమి కోనలో మిటా
రము క్రక్కుతూ నిగా
రము లొల్కుతూ కిన్నె
రటు లెగిరి యిటు లెగిరి
ననమేని వంపుతో - నునుమేని ముంపుతో
కాలిగజ్జెలు మ్రోగెనే—జల్లుమని
క్రాలు కెరటాల్ చిందెనే

అల కోనలో మంచు
వలి సోనలో వెల్లు
వల వాలలో కిన్నె
రటు లోడి యిటు లోడి
రస మేలు రూపుతో—పస మేలు రూపుతో
సొగసు వంపులు వంగెనే—వెన్నెలా
చిగురు మంపులు సూపెనే

తలి రోర్పుతో నీటి
యలలూర్పుతో అంద
ముల మార్పుతో కిన్నె
రటు తూగి యిటు తూగి
బిగువు టందాలతో—నగవుటందాలతో
నిండుగా ప్రవహించెనే—పువ్వుల్ల
చెండులా చెలు వొలికెనే

చిఱురాలపై మిఱ్ఱ
లగు నేలపై మెట్ట
లగు చేలపై కిన్నె
రటు దూకి యిటు దూకి
గ్రక్కదలు నీటితో—చిక్కవడు నీటితో
నీటి గుబురులు కట్టెనే—విరిపూల
తోటలా తళుకొత్తెనే

తెర పొర్లుతో యీగి
కొను మర్లుతో తిర్గి
పడు దొర్లుతో కిన్నె
రటు తరలి యిటు తరలి
పావురా యెలుగుతో—తీవలా యెలుగుతో
ఒత్తుకొని తరగొప్పెనే—తరగల్లు
ఒత్తిల్లి తటమొత్తెనే

అడవిలో చిఱుపాయ
లైవాకలై సోన
లై జాలులై కిన్నె
రటు ప్రాకి యిటు ప్రాకి
దివ్యనృత్యములతో—దివ్యనిస్వనముతో
దిగ్దిగంతము లంటెనే—సురనదీ
దీప్తి దిక్కుల చిమ్మెనే

జిలుగు టందియలతో
కులుకు క్రొన్నడలతో
వెలది కిన్నెరసాని
పలుత్రోవలుగ బోయి
తెలిపూల తేనెవాకలు వారగాచేసి
తెనుగు వాగై పారెనే-నెత్తావి
తెనుగు పాటలు పాడెనే

# కిన్నెరసంగీతము

కోనలన్నీ ముంచుకొనివచ్చు సెలయేటి
చాన కిన్నెరసాని జలజలా స్రవియించు
తరగలో, పైకెగయు
నురుగులో, క్రొంగ్రొత్త
తేనె కాలువ లూరెనో—అమృతంపు
వాన చినుకులు జారెనో

తేనె తరగల పిండుతోన జలజల సాగు
చాన కిన్నెరసాని జాలైన మేలైన
వాకలో, అందాల

రాకలో, బంగారు
జిలుగు గంటలు మ్రోగెనో - చిన్నారి
బిగువు నవ్వుల సాగెనో

తేనెలై కలకండ సోనలై వానలై
చానకిన్నెరపాట సాగులాడుట చూచి
చివరలో, చివురొత్తు
సవురులో, క్రొమ్మావి
వింతగా సిగ్గందెనో - కోకిలా
గొంతులో కద లాడెనో

చెఱకుపానక మెట్టు జీరపాకము వోలె
తరుణి కిన్నెరపాట తారులాడుటచూచి
పువ్వులో, లేసంజ
రువ్వులో, దానిమ్మ
తెల తెల్లనయి పోయెనో-క్రొంజిల్క
పలుకులో పసదప్పెనో

ప్రొద్దుకాకల జారిపోవు మంచునుబోలె
పొలతి కిన్నెరపాట పొంగిపోవుటచూచి
నీటిలో, కిన్నెరా
సాటిలో, అడవిలో
తోగుల్లు పారాడెనో-క్రొంజలువ
వాగుల్లు సాగాడెనో

పికిలి పిట్టల యీలలకు క్రొత్తసాటిగా
సకియ కిన్నెరపాట జరుగు లాడుట చూచి
సాములో, చిఱువెచ్చ
జాములో, మెల్లగా
పగలు పులకలు పొందెనో-మల్లెలా
సొగసు వెలుగులు చిందెనో

తొలివెన్నెల చివుళ్ళ తెలినిగ్గు విరజిమ్మ
వెలది కిన్నెరపాట విరిసిపోవుట చూచి
తెలుపులో, వెన్నెలా
మలుపులో, రేచాన
సిరివెల్లి పచరించెనో - విరిపూల
నెరతావి తరమెంచెనో

తలిరాకుకన్న మెత్తని యందమునుబోవు
తరుణి కిన్నెరపాట తాన మందుట చూచి
ఎడదలో, ఆనంద
జడధిలో, లోకాలు
పులకితమ్మయిపోయెనో-రసవార్ధి
చులుకితమ్మయి పోయెనో

చిఱుత తంగేటిజుంటి జీబు చిక్కనవోని
చిన్ని కిన్నెరపాట జీరసాగుట చూచి
పూలలో, తేనెల్ల
చాలులో, క్రొందేంట్లు
కదలు లాడుట మానెనో-వాకపై
పదువులై పరువెత్తెనో

ఒకసారి సన్నగా ఒకసారి విన్నగా
ఉవిద కిన్నెరపాట యొయ్యారములు చూచి
కళ్ళలో లేవచ్చ
మళ్ళలో, పసిలేళ్ళు
బెదరు చూపులు చూచెనో-మైనిగల్
నదరుగా కనుపించెనో

అంచ కన్నియయెల్గు అడవి సాగినయట్లు
అతివ కిన్నెరపాట అతిసన్నగిలి పోవ
పొరలలో, సనసన్న
తెరలలో, చిఱుగాలి
యాపాట సాగించెనో-ఉయ్యాల
తోపాటు వూగించెనో

అందకత్తెల జిల్గుటందె మ్రోసినయట్లు
చింది కిన్నెరపాట జిలుగుల్లుపోవగా
కూతలో, లేతమ్మి
మేతలో, రాయంచ
లొండొంటి ప్రేమించెనో-సింగార
ముండి కలయిక పొందెనో

ఏటి కిన్నెరపాట ఎగిరెగిరి మిన్నంది
సాటి తారలనడుమ చాలుగా నిరవొందు
దవ్వులో, జాబిల్లి
నవ్వులో, క్రొక్కారు
తలిరు పూవులు చిమ్మెనో-చొక్కంపు
తెలుగు వెలుగులు క్రమ్మెనో

కంచు గీసినయట్లు కదంబు తరగలతోన
మించి కిన్నెర పాట మేలిపోకలు వోవు
నిగ్గులో, అందంపు
జగ్గులో, వనమెల్ల
ఒక పాటయైపోయెనో-తనుదాన
మెఱుగలేకేపోయెనో

ముద్దు ముద్దుగ నడచి ప్రోడ వోలిక నాడి
మురిపమ్ముగా పాడి ముగుద కిన్నెరసాని
యెడదలో, ఎదురైన
బెడదలో, కష్టాల
కడలియే కల గాంచెనో-కన్నీటి
కడవలే ప్రవహించెనో



# కడలి పొంగు

గాలిపిల్లలెపోయి వూదెనో
మొగిలు కన్నెలు పోయి చెప్పెనో
తగని కోరికచేత తనలో కడలిరాజు
సొగసు కిన్నెరసాని చూడాలె ననిపించి
ఉఱ్ఱట్ల లూగెనూ
మిఱ్ఱెక్కి చూచెనూ

మిస మిసని మింటికై పొంగెనూ
మసక మసకల కళ్లు విప్పెనూ
ఎంత దూరా నుందో యీ చిన్ని పడుచంచు

సంతోసమే మేను సకలమ్ముగా మారి
మిరిమిర్రి చూచెనూ
బొటవ్రేళ్ళ నిలచెనూ

ఉబికి కెరటా లూగులాడెనూ
గుబురులై ఉప్పొంగి పోయెనూ
తనయొడల్తన కేమొ తెలియ నట్లయిపోయి
తరుణి కిన్నెర అందమే లోక మయిపోయి
సళ పెళా కాగెనూ
గల గలా పూగెనూ

తన సీటిగుణ మెందు పోయెనో
తన చల్లదన మెందుదాగెనో
పరగ తనలోనున్న బడబాగ్ని శిఖ పొంగి
తన శరీర మ్మెల్ల దహియించి నట్లుగా
తట పటయి పోయెనూ
తపియించి పోయెనూ

గంగ తన యిల్లాలు కాదటే
యమున తన యిల్లాలు కాదటే
ఎంతమందీ లేరు ఇన్ని యేళ్ళూ వచ్చి
చిన్ని వాగును చూచి చిత్త మెరియించుకో
తనకు నిది తగదూ
కడలిరాజునకూ

ఏనాటి ముసలి యీ కడలీ
ఏనాటి పెద్ద యీ కడలీ
తిరిగి నలుగురిలోన తిరుగ నేర్చినవాడు
పరగ కామమునకై బడలిపోయె నటన్న
తనకేమి పరువూ
కడలి రాజునకూ

తన కున్న మరియాద యెంతా
తన కున్న గౌరవం బెంతా
లోకాలు తప్పుత్రోవల పోవునాయేని
సర్ది చెప్పగలట్టి సామంతు డీ రాజు
తాను గా దిగెనా
తప్పు దారులకూ

అన్ని వాగులవంటి దగునా
అన్ని తోగులవంటి దగునా
మంచికిన్నెరసాని మగని కెక్కినదాన
కొంచె మేమో పొంది కోప మిట్లయినంత
తన్ను పొందునటే
తనకు దక్కునటే

వాగుగా తా నెప్పు డైనదో
తోగుగా తా నెప్పు డైనదో
జల జలా స్రవియించి బిలబిలా ప్రవహించి

కడలిరాజుహొరంగుకౌగింటిలో దూరు
టపుడె వ్రాసినదీ
అన్ని వాగులకూ

అని పొంగిపోయెనూ కడలీ
అని వూగులాడెనూ కడలీ
తనపైన తారాడు పడవ లల్లలనాడీ
వచ్చెనంచు తుపాను భయ మంది కుందగా
తెరచాప లూగా
కెరటాలు క్రమ్మా

కెరటాలు పొంగినా కడలీ
తరగ లూగాడినా కడలీ
సొగసు కిన్నెరసాని చూ పందుకొనుటకై
గగనమ్ము కొసదాక కెరటాలు వ్యాపింపి
దూరాలు చూచెనూ
బారలూ చాచెనూ

పొంగిపోయిన కడలి చూచీ
మిన్ను ముట్టిన కడలి చూచీ
ఈ అకాలపువేళ యేమో కడలి పొంగి
పోయెబో లోకాలు ముంచివేయునొ అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

ఊగులాడిన కడలి చూచీ
ఉలికిపోయిన కడలి చూచీ
ఉప్పు పెనగా వచ్చి ఉర్వి అంతాపొంగి
తెప్పలై నేలపై తేలియాడునో అంచు
కళవళం పడెనూ
జగము లన్నినూ

అదుగదుగో బాడబముపొంగే
అదుగదుగో నేలపైవచ్చే
అనిమానిసులు పిరికితనముగా చెప్పుకుని
మేనిలో ప్రాణాలు బిగియగా పట్టుకుని
కదలిపోయి రహో - ఒక రొకరి
వదలి పోవరహో

వచ్చె వచ్చెనటన్న కడలీ
పొంగె పొంగెనటన్న కడలీ
ఎంత చూచినను అట్లేనిల్చి పోవగా
ఎంత సేపటికి అట్లేనిల్చి ఉండగా
పిరకతగ్గినదీ
జగములన్నిటికీ

ఎట్లుపొంగిన దట్లుపొంగి
ఎట్లునిల్చినదట్లునిల్చి
ఒకనీటిబొట్టయిన ఉరలి నేలకు రాక

కడలి అచ్చోటనే కదలకుండుటచూచి
పిరక పోయినదీ
కొంత సేపటికీ

కడలి పొంగిన దంతెకానీ
కడలి ఉబికిన దంతెకానీ
కడలితా చెలియలీ కట్టదాటునెయంచు
కడలి మాత్రము బద్దె గడచిపోవునె యంచు
కడగి యనుకొనిరీ
బుడుతమానిసులూ

అన్నివిధములలోక మాడెనూ
అన్నిరీతుల జగము చెప్పెనూ
చిన్ని కిన్నెరసాని చిత్తాన పొగలెగయు
క్రొన్నిప్పుకలుతోడ కుమిలించి దహియించు
ఎవ్వరెఱుగుదురూ
నవ్వేటి జనులూ

కడలి మిన్నుల తాకు చూచీ
కడలి తరగలవ్రాగు చూచీ
కడలి తనకోసమై బడలుపడిపోవు నని
కడలి తనపైవలపు కమ్మికొనివచ్చె నని
కిన్నె రెరిగినదీ
కీడు వలచినదీ

మనసులో పెద్దదిగు లుట్టీ
ఎదలోన పెద్దవగ పుట్టీ
కదలిపోయెడినీరు గడ్డకట్టించుకో
సాగిపోయెడినీరు సాగ కింకించుకో
బిట్టు కోరినదీ
బెట్టు కుందినదీ

ఓనాథ నిను వీడి వచ్చీ
ఓరాజ నిను వీడి వచ్చీ
నా యొడల్పాయితమ్ము నానాజనులు కోర
యీయేవపుంబ్రదు కేల పొందితినిరా
అంచు వగచినదీ
అంచు లురలినదీ

అచటనే నిలిచిపో నెంచూ
అచటనే ఆగిపో నెంచూ
కాని నీటిగుణమ్ము కదలిపోవునెగాని
చాన కిన్నెరకోర్కి సాగించునే తాను
జలజలా కదలీ
బిలబిలా కదలీ

రాయడ్డముగ చేసి నిలుచూ
పొదలడ్డముగ చేసి యాగూ
ఇంత నిల్చితి నంచు నెంచి లో నుపొ్ంగి
పొంత పొంతలరాళ్లు పొదలు పైపై పొంగి
అడవి పరుగెత్తూ
అంతలో నేడ్చూ

## కిన్నెర దుఃఖము

హా యని కిన్నెర యేడ్చెన్
తనమనోహరుడు శిలయైనాడని
తానేమో యీవాగైనానని
హా యని యేడ్చెన్

ఊగులాడు కెరటాల నాపుకొన
సాగులాడు తరగల్లు నిల్పుకొన
ప్రాకిపోవు తనగుణము చంపుకొన
చాలక చాలక చాలక చాలక

హా యని

తనతొందరయును తనపతిప్రేమయు
తాను చేసినా తెలివితక్కువయు
తనపతి చూపిన త్యాగగౌరవము
తలచుచు తలచుచు బోరున బోరున
హా యని

ఏడుపునిప్పక లెగసి చిమ్ముకుని
ఏటినీరముల నెండగట్టుకుని
చేటు తప్పిపోయేటిరీతిగా
బాట యేల కనరాదని రాదని
హా యని

చుక్కనైతె యీబెడద తప్పునే
మొక్కనైతె యీవగపు తప్పునే
అక్కట నా చెలువునిదెస చేసిన
యిక్కలుషము నే దాటు పెట్టులని
హా యని

కడలి లోకములు నేలేరాజట
కడలి ధర్మములు నిలిపేదొరయట
కడు పతివ్రతల కవయ నెంచుటలు
కడలికి తగునా తగునా యిట్లని
హా యని

ఆతడు మంచివాడే యగునేమో
సతి వాగై ప్రవహించిన దంచన

అతనికోసమే అయిన దటంచును
మతి తలపోయుట తప్పెట్లగు నని

హా యని

ఏడ్చిఏడ్చి జల మెల్ల నెర్రనయి
ఏడ్చిఏడ్చి తనువెల్ల నల్లనయి
ఏడ్చిఏడ్చి నురుసుల్లు తెల్లనయి
ఏడ్చిఏడ్చి నడకల్లు వేగమయి

హా యని

బొట్టు బొట్టు కొక వేయి యెదలుగా
తరగ తరగ కొక వేయినోళ్ళుగా
బడలి నీరమే యేడుపుమయమై
కడలిమ్రోత లెక్కడు భయమిడగా

హా యని

గాలిపొరలలో కదలాడినవో
అడవిచెట్లలో అణగారినవో
వెలుగుదారులను విచ్చిచొచ్చినవో
కిన్నెరయేడుపు సన్ననిమెలుగులు

హా యని

కిన్నెరయేడుపు సన్ననియెలుగులు
విన్న యడవిలో చిన్ని పులుగుగమి
కిన్నెరతోపాటుగ గొంతులలో సన
సన్ననియేడ్పులు జాలువార్చగా

హా యని

శిలయైనపతిం దెలచినగాలులు
మెలమెల్లగ తన తరగల నూగగ
చలచల్లన ప్రాణములు తేరగ
తలచిన కొలంది దుఃఖము పొంగగ

హో యని

క్రొత్తవాగు పరతెంచి వచ్చె నని
క్రొత్తతోగు పర తెంచివచ్చె నని
క్రొత్త క్రొత్త యా బాలనీరములు
క్రోలగవచ్చినపులులు దిగుల్వడ

హో యని

ఎక్కడెక్కడీమృగములు వచ్చెను
ఎక్కడెక్కడీ పులుగులు వచ్చెను
ఎక్కడెక్కడీ గాలులు వచ్చెను
కిన్నెర నోదార్చుటకై పాపము

హో యని

కిన్నెరయేడుపు చూచి పులుగులూ
కిన్నెరదుఃఖముచూచి మృగములూ
కిన్నెరయేడుపు చూచి గాలులూ
ఓదార్చగలే కవియు నేడ్చెనూ

హో యని

చూచి వచ్చినా లేడి, కిన్నెరా
గాడివారినా యెడదలోపలా

వాడి వాడి లేజివురు వత్తలై
బేడిసకన్నుల నీరముపెట్టగ

హా యని

ఒడ్డునందు కుందేటికూన లవి
చిన్నిచెవులు తెగనిక్కపొడుచుకుని
ముందుకాళు లింపొంద నెత్తి యో
దార్చలేక తెలతెల్లవోవగా

హా యని

గూళ్ళలోన తమ పిల్లల వదలెను
మేతకొరకు పోవాలని మానెను
అడవిపులుగు లల్లల్ల చేరుకుని
అడవివాగు నోదార్చవచ్చెనూ

హా యని

పికిలి పిట్టాలూ అడవి పిచ్చికలు
నీటి పులుగులూ నేలపులుగులూ
తెగగుమికట్టిన తెలుగు పిట్టలం
దొకటి యేడ్చి మఱియొకటి యేడ్వదా

హా యని

కిన్నెరయేడుపు సన్నని యెలుగులు
మిన్ను మన్ను నది మడము నెడమునా
చిన్నివెలుగులో పిన్నగాలిలో
సన్న సన్నగా జాలువారగా

హా యని

చిన్ని కిన్నెరా సన్నని యెలుగులు
పిన్నగాలి కెరటాల చొచ్చునూ
ఎన్నడో వెనుకటి బ్రతుకున మిక్కిలి
విన్నవాటివలె విరవిరబోవును

హా యని

చిన్ని కిన్నెరా సన్నని యెలుగులు
చిన్ని చెట్ల క్రొంజివురు లంటునూ
ఎన్న నందనముగున్న మావులం
దున్న తుమ్మెదలరొదవలె మొరయును

హా యని

పడతి కిన్నెరా ప్రన్నని యెలుగులు
అడవిపచ్చికలయందున ప్రాకును
అడవి పావురా యెడబా టగ్గికి
గుడగుడ గొంతున కూసినయట్లగు

హా యని

అల్ల నల్ల కిన్నెర యేడుపు లవి
వెల్లివిరిసి గోదావరి కెరటము
లల్లలాడు నా నడిమిసందులో
మెల్లగ దూరెను మొర లిడుపోలిక

హా యని

అల్లనల్ల కిన్నెరయేడుపు లవి
మెల్లమెల్ల గోదావరిగర్భము

వెల్లిలోన చొరబారి మొత్తుకొని
గొల్లుమనుచు మొరపెట్టుకొన్నయవి
హా యని

గోదావరి యీవార్త విన్నదీ
గోదావరినది గుండె కరగినది
గోదావరినది జాలి పొందినది
గోచావరి కన్నీరు కార్చినది
హా యని

గోదావరినది పొంగివచ్చినది
గోదావరి తా నభయ మిచ్చినది
గోదావరి కెరటాలు చాచినది
గోదావరి రమ్మన్నది కిన్నెర
హా యని

కిన్నెర యెదలో పొంగిపోయినది
కిన్నెర యెదలో తాండపించినది
కిన్నెర మరి కన్నీరు కార్చినది
కిన్నెర తనకత చెప్పుకున్నదీ
హా యని

కిన్నెర తనకెరటాలు తగ్గినది
కిన్నెర తన యూగిసల నాపినది
కిన్నెర గోదావరి కెరటాలకు
చిన్నియలలు తా నంది యిచ్చినది హా యని

# గోదావరీ సంగమము

గోదావరీదేవి గుండె జలజలలాడి
ఆదగొని మనసు కదలాడీ జాలి
పొదులో పెలగిలి పూడీ కిన్నెరా
గేదంగి తెల్లరేకెత్తు క్రొత్తరగలో
చాదుకొని పెనుతరగ లూగీ ఆవాగు
నాదుకొని యామెవగ పాగీ

గోదావరీజాలిగుండె గూడులు కదలి
సామకిన్నెర కెదురుపోయీ ఆమె
లోధిగులు తరగ చేదోయీ వారించి

ఆదరముచే నామె నదిమి కౌగిట బూని
ఏది నీమొగము నాతల్లీ అన్నదీ
నీదిగులు నిక మాను చెల్లీ

గోదావరీపేదగుండె లోతులు కలగి
రాదగ్గరకు రమ్మ తల్లీ ఎంత
సాదువే నా ముద్దుచెల్లీ నీ వెన్ని
రాదగని కష్టాలరాశి మ్రగ్గితి వమ్మ
నీదుపతి శిలరూపు పొందీ నీ వేమొ
ఓదె పనవాగుగా చిందీ

గోదావరీజాలిగుండె ప్రేగులు తడిసి
నీ దుఃఖ మెంతవో తల్లీ నన్ను
నాదరువుగా నమ్మ చెల్లీ నిను చూచి
పేదలై లోకాలు పెద్దలై యేలేటి
జోదులే మతిచెడిరి తల్లీ నీయేడ్పు
రోదసిని నిండినది చెల్లీ

గోదావరీ యెడద కోసలను కోతపడి
రా దగ్గరకు రమ్మ తల్లీ కదలి
జోదింక నిను కనదు చెల్లీ నాతల్లి
నాదు గర్భమున నిన్నాదుకుని ఉంటాను
నీదు నెగులునుపోవ చూడూ కదలి
నీదు జోలిక నింక రాడూ

గోదావరిదేవి కొసమనసులో నొరసి
ఏది నీ యొడలు నా తల్లీ చేర్చు
నాదు కౌగిఁటిలో చెల్లీ తల్లినీ
లేవలిరు కెరటాలు నాదుకాల్వల నింతు
నీదుబొట్టును కడలి కనడూ నాతల్లి
నీదుసంగతి కడలి వినడూ

గోదావరీమహాకూలంకషామృత
శ్రీదివ్యమధుతరంగాలూ చిన్న
సాదుకిన్నెరతరంగాలూ కలసికొని
ప్రోదిగొను గంగాసరస్వతులనీరములు
చాదుకొను తళుకు లురపించే చూడగా
సైదోడుతనము మెరిపించే

గోదావరీదేవి కొసతళుకుముత్తెముల
మాదిరి సెలంగు కెరటాలూ చిన్ని
సాదు కిన్నెర తరంగాలూ కలసికొని
లేదళుకు వెన్నెలలో దలిరుమల్లికల
మూదలించిన యట్లు వొలిచే అవ్వాని
పొదలించిన యట్లు వలచే

గోదావరీదేవి కొరగించే మొగలి
వాదర హారంగు కెరటాలూ చిన్ని
సాదుకిన్నెర తరంగాలూ కలసికొని

గోదుమలవన్నె తెలిక్రొత్త మబ్బులజంట
ఊఁది కలిసిన యట్లు పొలిచే అందాల
గాదిలికవుంగిళులు మలచే

గోదావరీదేవి కోలుమసగే సన్న
నాదు సేసే తరంగాలూ చిన్ని
సొదుకిన్నెర తరంగాలూ కలసికొని
వీదిలో పెద్దక్క పిన్నక్క నవ్వుల్ల
బోదె లొదిగినయట్లు పొలిచే రతనాల
బొదులుంచినయట్లు పొలిచే

గోదావరీదేవి గునిసియాడే మీను
లీదులాడే తరంగాలూ చిన్ని
సొదుకిన్నెర తరంగాలూ కలసికొని
మీది వుయ్యాలలో మిసమిసను పసిపాప
మాదిరిగ కలసికొని వొలిచే నునుకాంతి
మేదురములై వెలుగు మెలిచే

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
సొది తనలో కలుపుకొనెనూ సీటి
పొదులో గ్రుచ్చెత్తుకొనెనూ ప్రేమతో
నా దేవి యాచానమోదాన కెరటాలు
సొదు నీరము కూడుకొనిరీ కోమలాం
భోదపఘులవలె మొఱసికొసరీ

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
సాది తనలో కల్పుకోగా కడలి
పాదుకోరిక పెల్లగిలగా కోపాన
ఆదేవి నడలించ నాలోచనముచేయు
కాదంచు మదిలోన నెంచూ మనసులో
వాదించు రంగు చెడునంచూ

గోదావరీదేవి గొప్ప వంశపురాణి
కా దనేందుకు వీలులేదూ ఆమె
కా దన్నపని సేయరాదూ అందులో
ఏది తనదెస న్యాయ మేదారి నాదేవి
కాదన్నపని మంచి దనునూ లోకాలు
వాదించితే మెప్పు గనునూ

గోదావరీదేవి గొప్పగుణముల చాన
వాదుపొందేపనుల రామూ న్యాయ
మేదారి విడి యెందు పోదూ అందులో
ఆదేవి మున్ను సీతారాము లొకరొకరి
నేదుకొను నెడబాటు నెరుగూ పరుల క
ష్టాదులకు మదిలోన మరుగూ

గోదావరీదేవి కోరి కిన్నెరసాని
నాదె తనలో కలుపుకొన్నా కడలి
యేది చేయగలేక యున్నా అందరూ

ఓ దొరా! నీ కిట్టు లీదిగులు కాదయా
కాపు పదిభక్తులను కోరా అవాగు
పేదరా అది నీకు మేరా

గోదావరీదేవి కొను సప్తఋషుల బి
డ్డాదివాహిని తప్పకోదూ తప్ప
నేదునే గాని కైకోదూ నీవు సి
గ్గేది కోపింతువా యేమొగముపెట్టుకొని
పోదు వాదేవికడ కింకా ఏరీతి
నాదేవికొాలి మాన్తు వింకా

గోదావరీదేవి గూడి కిన్నెసాని
సైదోడుగా మారినంతా కోర్కె
కేదారి మాయమయినంతా తనపొంగు
మైదించుకొని కడలి లో దించుకొని కడలి
మీదిపొంగు కుదించుకొనెనూ లోలోన
నాదుగా తెగ మొఱసికొనెనూ

గోదావరీనీరుకూడి కిన్నెరనీరు
ఏది యేదో తెలియనంతా కోర్కె
కేదారి మాయమయినంతా తొల్లింటి
సొదురూపము పొంది సాగి చెలియలికట్ట
కేదో మెలమెల్లగా చెప్పా పడవలకు
పోదారిగా సీర మొప్పా

గోదావరీదేవి కూడి కిన్నెరసాని
యేదిగులు లేక తెలివొందే
సాదుతరగల గుములుచిందే
సేదారినో చచ్చుపేగదా
లేదు చావో తనకునైనా
లేదు చావును మగనికైనా

చల్లి
మనిసిగా
మరి యిపుడు
అనుకుంది

# కిన్నెర వైభవము

తూర్పులో తెల్లనై తోచిన దుషఃకాంత
తొలి మావిలేబూత దూసెను పికీ కాంత
తలలపై రతనాలు తళతళా మెరిసేటి
నల్లత్రాచులు దూకి నాట్యమాడేటట్లు
మెరసింది కిన్నెరా ఒడ్డుల్లు
ఒరిసింది కిన్నెరా

పొందమ్మి తెలివొంద పొడిచింది క్రొంబొద్దు
మేల్కొను మెగాలతో మెలగిన దడవిసద్దు
పసుపుబట్టలు ఆరపట్టగా నేలపై

గాలి లేబొరలలో కదలు లాడీనయట్లు
కలిదంది కిన్నెరా కాంతితో
మెదలింది కిన్నెరా

ప్రొద్దెక్కి గాలిలో పుట్టింది చిఱువెట్ట
పొదల బుర్రుమని కూసింది కోమటిపిట్ట
రేల చెట్టాకెల్ల రాలి క్రొత్తచివుళ్ళు
తోడిగి లేయెండలత్రోవ దూకినయట్లు
పొలిచింది కిన్నెరా తెలువుల్లు
మలచింది కిన్నెరా

జాము జామున్నర సాగెను చదల ప్రొద్దు
నెమలికూతలతోడ నిండిన దడవిసద్దు
తరగ విరిగినచోట తరణికాంతులుప్రబ్బి
గాజుముక్కలు సూర్యకాంతి మండినయట్లు
పొదలింది కిన్నెరా అందాలు
వదలింది కిన్నెరా

మిగుల తా నడిమింట మెరసిమండెను తరణి
నెగడె కాంతారమ్ము నిశ్శబ్దమగు కరణి
మరకతమ్ములు నేల పరచగా పడ్డట్లు
పొరుటాకులమీద పసిమి యూదినయట్లు
నడచింది కిన్నెరా సొగసుల్లు
ముడిచింది కిన్నెరా

మూడుజాముల ప్రొద్దు మొగి జారినది మింట
వెనుకపట్టైను తమ్మివిరిమేల్వాలపుపంట
కళ్ళమ్ముత్రుడిచి పండిన గోదుమలకుప్ప
తూర్పు గాలులకు తూర్పారపట్టినయట్లు
జారింది కిన్నెరా                    పైడిగా
మారింది కిన్నెరా

మూరగా బారగా ప్రొద్దు వాటారింది
పొలము పిచ్చికగుంపు పుగుగుమే తేరింది
అడవి చెట్లులనీడ లవఘళించిన నీరు
నలుపుతిరిగినపైరు నాట్యమాడినయట్లు
తరలింది కిన్నెరా                    తరగల్లు
ఉరలింది కిన్నెరా

కొండ దగ్గిరసగా క్రుంకింది ముదిప్రొద్దు
మింట వచ్చెను పిట్టగముల రెక్కలసద్దు
అడవిలో బోయ వేటాడినట్టి మృగాల
తొడుసులం బడి నల్లతోగు వారినయట్లు
నడచింది కిన్నెరా                    రంగల్లు
ముడిచింది కిన్నెరా

నల్లగా రేచాన నడచింది తొలిజాము
గొల్లుగా బొబ్బలిడె క్రోల్పులుల్ పెనుదీము
దొడ్డదొరముంగిళ్ళ తోరణాలుగ వ్రేలు

హారినీలమణుల కాంతులు ప్రబ్బినట్లుగా
మారింది కిన్నెరా ఊటలై
ఊరింది కిన్నెరా

నడిరేయి నల్లనై నాట్యమాడిన దడవి
నిడిపులుల్ మృగముల వెదకి చంపెనుతడవి
నీరుసాగునో యేమొ నీరు కన్పడరాక
తరగ సవ్వడిమాత్ర గురుతు పట్టెడు నట్లు
పోయింది కిన్నెరా నలుపులా
చే యంది కిన్నెరా

శుక్లక్షమువచ్చె చూచుచుండగ మింట
శోభిల్లె చిన్ని జాబిల్లి తారలజంట
తెచ్చి మణులుగ ఛాదీవెండి కంసాలి
మూసలో కరిగించి పోసినయట్లుగా
ఆడింది కిన్నెరా తళతళ
లాడింది కిన్నెరా

తలిరాకుతుద దక్కి తారెను వసంతమ్మ
కోకి లోర్చెను నెమలికూతలకు పంతమ్ము
మగనిపే రెడబాటు పొగల సగమయిపోయి
బహు సన్నగిలిపోయి పాలిపోయిన మేన
మెరసింది కిన్నెరా ఎదలోన
మెరసింది కిన్నెరా

ఎడనీరు కాల్వలై యేరులై పోవుకై
వడి మృగమ్ములు దప్పికలు తీర్చుకొనురీతి
సాగింది కిన్నెరా బూదిరం
సాగింది కిన్నెరా

మండు యెండలు గాసి మాడ్చినది గ్రీష్మమ్ము
కొండయంచులనుండి కురిసినది ఊష్మమ్ము
నీటిపుట్టము తొలఁగి నిలువెల్ల నిప్పులో
యేటియిసకలు మండి యెగసిపడిపోవగా
ఏడ్చింది కిన్నెరా తనువెల్లి
మాడ్చింది కిన్నెరా

అడవిలో చిరువూటయట్లుగా కదలాడి
పాలలో కలిపిన పంచదారవిధాన
రుచిహెచ్చె కిన్నెరా సితమణి
చ్ఛవి గ్రుచ్చె కిన్నెరా

వడగళ్ళతో వచ్చిపడె వానకాలమ్ము
పుడమి పచ్చికలతో పొంగెను ససాలమ్ము
పతిగుట్ట మొగిలుతోడున క్రుమ్మరించిన
అతిప్రేమవారి దేహమ్మెల్ల నిండగా
సుడిసింది కిన్నెరా అందాలు
తడిసింది కిన్నెరా

నలగఁగొట్టిన పంగనామాల చెరుకులో
నలిబూదెరంగు పానకము జారినయట్లు
వడిచింది కిన్నెరా నల్లవై
నడచింది కిన్నెరా

అంచరెక్కలతోడ నరుగుదెంచె శరత్తు
పంచలందున తెల్పుపడె కొంచెము సరిత్తు
మొదలిపొంగులు పోయి పోనుపోన్స్వచ్ఛమై
తేరుకొన్న మనోహరుని ప్రేమపోలిక
కదిలింది కిన్నెరా కెరటాలు
మెదిలింది కిన్నెరా

బంగారుతీగలో పానకమ్మునుబోలె
మరియు చిక్కనగాక మరియు పల్చనగాక
తరలింది కిన్నెరా పండ్లరం
గురలింది కిన్నెరా

దిశదిశల్ మంచులో తేలించుకొనె కారు
తెల్లనై తరగల్లు తేలించుకొనె నేఱు
రాణివాసమువొల్పు రమణి మేల్ముసుగులో
వెండితీగవితాన వెలిగిపోయెడునట్లు
వెలిగింది కిన్నెరా దారిలో
మలగింది కిన్నెరా

శైవాభిషేకరం జన్నారికేళిగ
ర్భాంబువుల్ వాకలై అడవి పారినయట్లు
కదలింది కిన్నెరా ముత్యాలు
వదలింది కిన్నెరా

శిశిరాగమము వచ్చి చెట్లయాకులు దూసె
ముసలులై జంతువులు ముడుచుకుని కన్మూసె
పతిప్రేమ చూరాడి బహుగా ననుభవించి
పొలతిదేహ మ్మెల్ల ముడుతల్లు పడ్డట్లు
పొలిచింది కిన్నెరా నిలుకడల్
వలచింది కిన్నెరా
రాలియెండినయాకు లోలిపడి నీరముల్
మాగి యెర్రని క్రొత్తమధువు జారినయట్లు
తోచింది కిన్నెరా యర్రనై
యేచింది కిన్నెరా

ఋతువు ఋతువున మారు రుచులలో కిన్నెరా
కారు కారున మారు కాంతిలో కిన్నెరా
తెలుగు సత్కవిరాజుపలు కందుకోలేని
ఛవులూరి చవులూరి జలముల్ల ప్రోవులై
కదిలేను కిన్నెరా
సాగేను కిన్నెరా

తెలుగు దైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతని దర్శనము చేసేత్రోవ
కాచింది కిన్నెరా
తెలుగు యాత్రికుల కందిచ్చు చల్లనినీడ
పుణ్యాత్మ కిన్నెరా
తెలుగు యాత్రికుల కందిచ్చు చల్లని నీరు
పూతాత్మ కిన్నెరా
తెలుగుదైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య అతనిదర్శనము చేసేత్రోవ
కాచింది కిన్నెరా



# కోకిలమ్మ పెళ్ళి

లేతబుర్రలు కొక్కిరిస్తే
ఆతగాళ్ళతో యేమిగాని
తాతతాతలనాటి కతలూ
తవ్విపోస్తానోయ్!

ఊగులాడే కడలితరగలు
నాగుబాముల కోడెలల్లే
ఒడ్డుదాకా ప్రాకిప్రాకి
ఒరిగిపోతా యోయ్!

ఒడ్డుదాకా అడివి, అడివిలో
దొడ్డచెట్లున్నాయి తరగల

వూగులాడే గాలిచేతా
వూగుతుంటాయోయ్ !

అడవిలోనూ కడలిలోనూ
అద్దరాతిరివేళ అప్పుడు
తొగరుకన్నుల చుక్కకన్నెలు
తొంగిచూస్తారోయ్ !

పొద్దుకూకేవేళ వొడ్డున
ముద్దు ముద్దుగ తిరుగుతూంటూ
సొగసునడకల గాలిపిల్లలు
సోకుపోతారోయ్ !

సుళ్ళు తిరిగే కడలినడుమా
చూపు కందీఅందకుండా
తెప్పలేసుకు పాముపడుచులు
తేలిపోతారోయ్ !

ఒడ్డునే బంగారుచేలూ
ఒడ్డునే పూవుల్లు చేత్తో
ఊరికే యిట్లంటె చాల్ పా
లుబికిపోతాయోయ్ !

*   *   *

నేను చెప్పేకతలు జరిగీ
యెన్నినాళ్ళయ్యిందో అప్పుడు
మలలు పొదలూ కొండకోనలు
తెలుగునా డంతా !

కడలివొడ్డున పల్లె వొక్కటి
కలదు, తే డున్నాడు దానికి.
అప్పటికె యీ తెలుగు లంతా
గొప్ప యెకిమీళ్ళా !

వెదురులో ముత్యాలపేరులూ
కదురులో దారాలబట్టలు
ఎదురుగా నెలపొడిచినట్లే
ఏపు మీరేదోయ్ !

దొడ్డదొర, అతగాడినేలలో
ఎడ్డెపనులే చేయ రెవ్వరు,
దొంగనాగరికతలో దేశం
తూలిపోలేదోయ్ !

ఉన్న వాళ్ళకు ఎంతనేలా
దున్నుకుంటే చాలుతుందో
మించి ముట్టరుకూడ పైనా
చిన్న చెక్కయినా

మిగిలినా అడవూలు, కొండల
కెగురుతూ, మబ్బూల కన్నెల
తగులుతూ, తరిలోన వానలు
కురుస్తుంటాయోయ్!

అందరికి కావలసినంతా
వుంది యెవ్వరితోడ నెవరికి
నెన్నడూ చూడ లేమన్నా
చిన్ని తగవైనా!

ఆవొరకి కూతుళ్ళు ఇద్దరు,
మోదుగులు పూశాయి పెదవులు,
వారి పేరులు, చిలకతల్లీ,
కోకిలమ్మానూ

కోకిలమ్మా నల్లనిదీ
చిలకతల్లీ పచ్చనిదీ
చిలకతల్లికి కోకిలమ్మకు
ఎప్పుడూ పడదూ

చిలకతల్లీ చిన్ననాదే
పలుక మొదలెట్టింది ముద్దుల
మొలకలై తండ్రికీ మేనూ
పులకరించిందీ

ఎన్నో యేళ్ళూ వచ్చినాయీ
కన్ను లింతగ తెరచినాదీ
పాపమేమో ! కోకిలమ్మకు
మాటలే రావూ

చిలకతల్లికి రంగురంగుల
చీరలూ తెస్తాడు తండ్రీ,
కోకిలమ్మను ఊరికేనే
కోపపడతాడూ

చిలకతల్లీ నవ్వివోతే
తండ్రి మారూ పలుకకుంటే
తల్లి వంకా చూచి కోకిల
తెల్లపోతుందీ

చిలకతల్లీ వెక్కిరిస్తే
తండ్రి వచ్చీ కసురుకుంటే
తల్లివెనుకా దాగిపోతూ
తల్లడిలుతుందీ

తల్లి యేమీ చెయ్యలేకా
తాను కూడా విసుక్కుంటే
కోకిలమ్మా లోనె లోనే
కుమిలిపోతుందీ

రోజు రోజూ కడలితరగల
రొదలలో కలసి యేడుస్తూ
మరుసులోపల వట్టిచూపులు
నిలిపి పోతుందీ

అడవిలో యే చెట్టుకిందో
అంత యెగ్గూ తలచుకోనీ
కూరుచున్నది కూరుచుండే
కుంగిపోతుందీ

చెట్టుతోనో పుట్టతోనో
చెప్పుకుందామన్న గానీ
ఎట్టివాడో వాడు నోరూ
పెట్టలేదాయె

కొండవాగుల్లోను ప్రొద్దూ
గూకులూ కూర్చుంది యిసకలొ
గూళ్ళులేనీ పిచ్చికలకీ
గూళ్ళు కడుతుందీ

కొండవాగులవెంట పోతూ
కొండపువ్వులవంక చూస్తూ
ఎంత పొద్దోయినా గానీ
యింటికే పోదూ

ఒక్కొక్కప్పుడు తెల్లవార్లూ
అడవిలోనే వుండిపోతే
తల్లి ఊరక తెల్లవార్లూ
తల్లడిలుతుందీ

* * * *

వానరోజులు వచ్చిపోగా
చలిపగళ్ళు సాగిపోగా
ఆకురాలుట ఆగి చివురులు
జోకతాల్చాయీ

చివురులూ కొమ్మలాచివరా
గుబురులై గుబురులా చివరా
పూవులూ నాలుగూవై పుల
బుగులుకొన్నాయీ

చివురులో యీనెల్లై, పసిరిక
పూవులో తేనెల్లై, పలపల
చిలకతల్లికి కోకిలమ్మకు
వయసు వచ్చిందీ

చిలకతల్లీ చదువుచూచీ
చిలకతల్లీ సొగసుచూచీ
గాలిపిల్లలుకూడ లోపల
కలత పడ్డారూ

చిలకతల్లీఅంద మంతా
చిందిపోయీ అన్నివైపుల
కనులచూడని వారుకూడా
అనుకునేవారే

చెట్లరాణీ తలాడిస్తూ
చిలకతల్లీవోసుకతలే
నింగిలో దవ్వ్వాన యెచ్చటో
పొంగి పాడిందీ

ప్రొద్దుకూకేవేళ తిరుగుతు
ముద్దు లొలికే గాలిపిల్లలు
చిలకతల్లీఅంద మెప్పుడు
వొలకపోస్తారూ

ఎల్లవారూ చిలకతల్లినె
పెళ్ళికై కోరారు. తండ్రీ
తల్లి మాత్రము పిల్లదాన్ని
కళ్ళ కాస్తారూ

కడలిఅడవులచేండ్లు తమలో
కలుపుకుంటారేమొ అనుకుని
గడపదాటీ చిలకతల్లిని
కదలిపోనీరూ

ఇంటిముంగిలి దాటనీకా
ఇంటిపనులూ చేయనీకా
కంటికీ రెప్పాకిమల్లే
కాచుకుంటారూ

చిలకతల్లీ సొగసువాకలు
చిలపలై పలపలై యంచపు
మొలకలై తేనెలాచినుకులు
గలపరించాయీ

చిలకతల్లీఅంద మేమో
చిలకతల్లిపెళ్ళి యేమో
తల్లి తండ్రీ కోకిలమ్మను
తలచనేపోరూ

*   *   *

ఒక్క మధ్యాహ్నంబునందున
చెక్కులను కుండలప్రభ లవి
పిక్కటిల బ్రాహ్మణుం డొక్కరు
డక్కడికి వచ్చెన్

చిలకతల్లీ తల్లిదండ్రులు
చేరవచ్చిన ఆతనికోసము
కోరినట్టివి యన్ని యిచ్చి
ఆదరించారూ

వేదపనసలు చెప్పుకుంఛూ
వాదములకు కాలు త్రవ్వుచు
ఆయనా తెలుగురాజింటో
ఆగివున్నాడు

అతనివేదధ్వనులు వింఛూ
ఆతనివర్చస్సంత కంఛూ
చిలకతల్లీ అతని తనలో
నిలిపివేశిందీ

సంగతంతా తెలిసిజేడూ
పొంగిపోయాడేమొ కానీ
తల్లికీ చిలకతల్లంటే
వెఱ్ఱకొచ్చిందీ .

* * *

కోనలందూ అడవులందూ
కోకిలమ్మా తిరుగుతోందీ
ఎంత యేడుస్తోందొ తల్లీ
యింటికే రాదూ

ఏయెఱుంగని నేలవాడో
యింటికొస్తే వాడిమీదా
చిలకతల్లీ వలపు తానూ
నిలిపివేశిందీ

కోకిలమ్మా యింటికైనా
రాక అడవుల్లోనె తిరుగుతు
పోకిళ్ల మారైంది, తల్లికి
కాకపోయిందీ

అడవులెంటా కోనలెంటా
బుడబుడా చను సెలలవెంటా
అడుగులూ తడబడా వెదుకుతు
నడచిపోయిందీ

రెండుజాముల వేళ పులులూ
పండుకొని రావ్వేటినీడల
గుండె గుబగుబలాడ పోయీ
కూతు వెదకిందీ

పెద్దపులులు సివంగులూ ద
ప్పికలు తీరగ నీరు త్రాగే
దొంగత్రోవల సెలమొదళ్లా
తొంగిచూశిందీ

అడవిమెకములు తిరుగులాడే
ఎడము లేనీ అడుగులొప్పే
అడవిలోపలికోన లెల్లా
తడివిచూశిందీ

పెద్దపులులనుకూడ చంపీ
పీల్చి పిప్పిగ చేసివేసే
అడవి కుక్కలుప్రాకులాడే
కడలచూసిందీ

లేళ్ళనూ తిని కొండసిలువలు
కళ్ళు మూసుకు నిదరపోయే
బిల్లుడడవిలో వుస్సురంటూ
వెళ్ళి చూశిందీ

ఎచట పోయీ వెదకినానూ
ఎందు లేదూ కోకిలమ్మా
ఎచ్చటుందో తల్లిగుండే
వ్రచ్చిపోయిందీ

ఒక్కనెలయేట్లోకి వేరూ
మిక్కిలీపోయినా ముషిణీ
ప్రక్కచెట్టూక్రింద కూర్చుని
స్రుక్కిపోయిందీ

తల్లివెనకా యింతసేపూ
మెల్లగా వస్తోంది కోకిల
తల్లిబాధా కళ్ళచూశీ
గొల్లు మన్నాదీ

ఉరుములా పురిమింది కోకిల
మెరుములా మెరిసింది కోకిల
వొక్కగంతున తల్లివొళ్ళో
వొచ్చిపడ్డాదీ

తల్లి బిడ్డను బిడ్డ తల్లిని
కళ్ళు మూసుకు కౌగిలించీ
ఒళ్ళుతెలియక చెట్టుమొదటా
ఒరిగిపోయారూ

ఒరిగిపోయిన తల్లి బిడ్డా
ఒరిగినట్లే ఆయిరిగానీ
ఒక్కరైనా లేచికళ్ళూ
తెరవనేలేదూ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
మెల్లగా పాడింది అడివిలో
పిల్ల సెలయేరూ

తల్లిబిడ్డలప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
కానలోనీ తీగలన్నీ
కదలు లాడాయీ

తల్లిబిడ్డల ప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
గాలిపిల్లలు వెదుళ్ళలో రా
గాలు తీశారూ

తల్లిబిడ్డల ప్రేమ అంటే
యిల్లాగు వుండా లటంటూ
ప్రకృతిదేవీ వొళ్లతెలియక
పాట పాడిందీ

ఎప్పుడూ గిలకల్లె అడవిలో
ఎచట చూస్తే అచటవుండే
చిన్న కోకిల లేక అడివీ
చిన్నవోయిందీ

కోకిలమ్మా తానమాడని
కోకిలమ్మా పుక్కిలించని
అడవిలోపలి వూటయేటికి
అందమే లేదూ

కోకిలమ్మా చివురుకోయని
కోకిలమ్మా పూలుతురుమని
అడవిలోపలిచిన్న చెట్లకు
అందమే లేదూ

కోకిలమ్మా తిరుగులాడని
కోకిలమ్మా లేని అడవీ
కోనలకూ తొలుకారుటందం
కొరతపడ్డాదీ

తల్లిఅంటే అంత ప్రేమా
వెళ్ళ గ్రక్కిన కోకిలమ్మకు
చావు లేదని మావిచివురూ
సాగు లాడిందీ

తల్లిఅంటే అంతప్రేమా
వెళ్ళగ్రక్కిన కోకిలమ్మా
మునిగిపోదని అడవిపూటా
ముర్మురించిందీ

తల్లిఅంటే అంతప్రేమా
వెళ్ళగ్రక్కిన కోకిలమ్మా
బ్రతికి వస్తుం దంచు అడివీ
పాటపాడిందీ

ప్రొద్దుకూకేవేళ వెన్నెల
ముద్దుగా కాసింది జాబిలి,
చావు లేనేలేదు ప్రేమకి
చావు లేదందీ

వానలన్నీ వెనుకపట్టీ
కోనలన్నీ నీరువట్టీ
ఆకురాలే కారుకూడా
ఆగిపోయిందీ

చిన్న మొగమున కుంకుమిడినా
కన్నె పేరంటాలి మల్లే
చెలువుగా అడివంత క్రొత్తగ
చివురు తొడిగిందీ

గోదుమావన్నె త్రాచల్లే
కొబ్బరీపాలల్లె అడవీ
చిన్నివూటా వొదిగి వొదిగీ
చెన్ను వొలికిందీ

ఎక్కడో ఆడవిలో చివరా
చక్కగా సన్నగా యేదో
చిక్కనైనా తేనెపాటా
జీరు వారిందీ

ఆపాట వింటూనె అడివీ
అడివిగా నిలువెల్ల, పోయిన
వొక్కచుట్టం వచ్చినట్లూ
వులికిపడ్డాదీ

సన్నగా పోతున్నపూటా
జాలు జాలింతై వెడతై
పట్టలేకా ఓర్పు జలజల
పరువులె_త్తిందీ

కోకిలమ్మా అదుగో మళ్ళీ
కూసెనంటే కూసె నానీ
వచ్చెనంటే వచ్చె నానీ
బ్రతికెనంటే బ్రతికె నానీ

ఒళ్ళు తెలియక అడవిపూటా
పొర్లిపోయిందీ
చెన్ను తరగని మావిమోకా
చివురు తొడిగిందీ

అంతలోపల నడవి కందం
అతిశయించిందీ

*    *    *

అంతలో పూవుల్ల రేడూ
వింతవింతల సోకు లేలిక
చెక్కులా నవ్వులు చిలుకుతు
చేరవచ్చాడూ

ఏడాది కొకసారి వస్తా
దేడాది కొకసారి తెస్తా
డెన్ని పువ్వులు, అతనివేనూ
వన్నెలూ చిన్నెల్

వచ్చావటయ్యా పూలఱేడా,
తెచ్చావటయ్యా పూలరాజా,
నీవు తెచ్చిన పూవులే కా
నికిల కిస్తామూ

కోకిలమ్మను ముద్దుపెళ్ళి
కూతురును చేస్తాము, పెళ్ళి
కొడుకునూ చేస్తాము నిన్నూ,
కూర్చి వేస్తామూ

కోరి నీ అందానికీ మా
కోకిలమ్మా గొంతుకునకూ,
సొగసుచేతా పాటచేతా
తగేపోయిందీ

రావయ్య ఓ పూలరాజా
రావయ్య ఓ అందగాడా
కోకిలమ్మకు నీవు, నీకూ
కోకిలా తగునూ

వారిపెళ్ళికి అడవి అంతా
తోరణాలైనాయి చివురులు
కాపలా కాసినై పులులూ
గండశిలలందూ

సన్నాయి పాడింది తెల్లని
సన్ననీ సెలవూట పూలా
వెన్నెలై ప్రకృతి తల్లేమో
కన్ను తెరచిందీ

పూలసోనలు కురిసినై, తే
నేలపాటలు విరిసినై, అం
దాల త్రోవలు వెలిసినై, రాజ
నాలు పండినవి

చిలకతల్లి మహాన్వయంబున
నిలిచినవి సాంస్కృతిక వాక్కులు
కోకిలమ్మా తెలుగుపలుకూ
కూడబెట్టిందీ